# ఆనందమయి

(పద్య స్తోత్రమాల)

అంకితము:

కం. శ్రీదేవీ! ఈ కృతి నీ
కాదరమున నిచ్చు చుంటి నంకితముగ నీ
పాదములకు మ్రొక్కుచు న
మ్మా! దయతో స్వీకరింపు మానందమయీ!

# శ్రీపదార్చన

తే.గీ. అమ్మ పాదాలు మృదుల నవ్యాంబుజాలు
అమ్మ పాదాలు స్వచ్ఛమ్ములద్భుతాలు
అమ్మ పాదాలు దివ్య శోభాకరాలు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు పరమ కృపాస్పదాలు
అమ్మ పాదాలు సద్వివేకార్ణవాలు
అమ్మ పాదాలు సకల విద్యాలయాలు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు సకల భయాపహాలు
అమ్మ పాదాలు సకల జయప్రదాలు
అమ్మ పాదాలు సతతాభయప్రదాలు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు తిమిర సంఘాంతకాలు
అమ్మ పాదాలు జన్మ దుఃఖాపహాలు
అమ్మ పాదాలు ధ్యేయమ్ము లమృత నిధులు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు నిరత శ్రేయప్రదాలు
అమ్మ పాదాలు రుచిర కామ్యప్రదాలు
అమ్మ పాదాలు దేవబృందార్చితాలు

అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు భక్త జనాశ్రయాలు
అమ్మ పాదాలు సంవిత్ప్రభాకరాలు
అమ్మ పాదాలు శక్తిత్రయాన్వితాలు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలు నిగమ శీర్షాత్మకాలు
అమ్మ పాదాలు సుజన విహారవనులు
అమ్మ పాదాలు లోకత్రయావనాలు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదాలువిశ్వ నియామకాలు
అమ్మ పాదాలుపరమ రహస్యనిధులు
అమ్మ పాదాలుమద్హృదయస్థ మణులు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

అమ్మ పాదల సేవల నాచరింతు
అమ్మ పాదల కడ సౌఖ్య మభిలషింతు
అమ్మ పాదాల నిత్యమ్ము నాశ్రయింతు
అమ్మ పాదాలు కొండంత అండ నాకు

శ్రీమాత్రే నమః

# తొలి పలుకు

కం. చైతన్య సుధా ధారల
ప్రీతిగ వర్షించి జ్ఞాన విభవమ్మెసగన్
చేతోమోదమునిడు ప్ర
ఖ్యాతా! శ్రీమాత! సచ్చిదానందమయీ!

శ్రీమాత "ఆనందమయి" – "సచ్చిదానందమయి" – పరమానంద నిధానము. ఆ ఆనందము సత్ (అనగా ఎల్లప్పుడు ఉండెడిది – లేక పరబ్రహ్మమే), చిత్ (అనగా జ్ఞానము) నకు రాశి – అది పరమము, అనిర్వచనీయము, నిరవధికము, అప్రమేయము,నిస్తులము.

ఆ మాతయొక్క కరుణా కటాక్ష వీక్షణలు నిత్య సుఖ ప్రదములు – సంతతము సుధాధారలను వర్షిమ్పుచు సాధకులకు మనః ప్రమోదము కలిగించుచుండును. ఆ సుధా ధారలను అనుభవిమ్చ్వు సాధకుల హృదయములలో విజ్ఞాన తేజము నిండును – పాండిత్య వైభవము వెల్లివిరియును. కవితా ధార ప్రవాహము వారి కలము నుండి మహాతేజముతో ప్రవహించును.

అప్రయత్నముగా నొక సాయంకాలము నా హృదయములో "ఆనందమయి" అన్న్య పదము మెదలినది. అమ్మ ఆనందమయియే. ఆనందమయి అను శబ్దము పవిత్రమైనది, మధురమైనది, శ్రావ్యమైనది, రసమయమైనది – అందుచేత తప్పక పద్యములను "ఆనందమయి" అను మకుటముతో రచించుటకుపక్రమించితిని. ఆ ధార ఆగలేదు – చక్కగ సాగినది – నాలుగు రోజులలో శతకము పూర్తి అయినది. ఆనందము నిండిన హృదయముతో కృతజ్ఞతతో ఈ స్తోత్రమాలను అమ్మ పాద పద్మములకు నివేదించు చున్నాను. చదువరులీ రచనలోని సొంపులను గ్రహించగలరని ఆశిస్తున్నాను.

మంగళమ్ మహత్

ఇట్లు
బుధజన విధేయుడు
సేమాని రామజోగి సన్యాసి రావు

శ్రీమాత్రే నమః

# ఆనందమయి

ఓమ్మన నలరెడు నీ త
త్త్వమ్మును పరమాదరమున ధ్యాన మొనర్తున్
తమ్ములలో విహరించెడు
నమ్మా! కరుణాంతరంగ! ఆనందమయీ! 1.

ఓమ్మను నాదమ్మును శ్రా
వ్యమ్ముగ గొలుపుచును విశ్వమంతట చైత
న్యమ్మును నింపుచు నుండెడి
యమ్మా! నీ మహిమ దలతు నానందమయీ! 2.

ఓమ్మను మంత్రముతోనే
అమ్మల ముప్పుర సృజించి యధినేత్రివియై
యిమ్ముగ జగముల నేలెడు
నమ్మా! నిను గొలుతు సచ్చిదానందమయీ! 3.

శ్రీమాతా! శ్రీవిద్యా!
శ్రీమత్సింహాసనేశ్వరీ! చిద్రూపా!
శ్రీమాహేశ్వరి! జగదం
బా! మహనీయా! దయాబ్ధి! ఆనందమయీ! 4.

శ్రీలలితా పరమేశ్వరి!
బాలా! బాలేందుమౌళి! వాత్సల్యముతో
పాలింపుము మము నిత్యము
నాలింపుము మా వినతుల నానందమయీ! 5.

శ్రీచక్రాంతరచారిణి
యై చెలగెడు నిన్ను నేను నచ్చపు మదిలో
జూచి తరించెడు సుఖమి
మ్మా! చంద్రకళాంచితా! చిదానందమయీ! 6.

అమ్మాయని తలపగనే
నెమ్మనమున జ్ఞాన కాంతి నింపుచు సంతో
షమ్మును గొలుపుచు చైత
న్యమ్మును గూర్తువు భవాని! ఆనందమయీ! 7.

అమ్మవు మూడు జగమ్ముల
కమ్మవు ముగురమ్మలకును నాగమ వినుతా!

నమ్మి కొలుతు నిను నా హృద
యమ్మున నలరారు సచ్చిదానందమయీ! 8.

అమ్మాయని పలుకగనే
కమ్మని నాదమ్ము నాదు కర్ణమ్ములలో
చిమ్మెద వది నీ వాత్స
ల్యమ్మని పొంగెద మహేశి! ఆనందమయీ! 9.

ఆనందమె బ్రహ్మమ్మని
ఆనందమె ధ్యేయమనుచు ననవరతమునే
నానంద నిధానమ్మును
ధ్యానమ్మున బొందుచుందు నానందమయీ! 10.

లలిత మణిద్వీపమ్మున
గల చింతామణి గృహాన కామేశునితో
నలరారెడు తల్లీ! నిను
నలరించెద పద్యకృతుల నానందమయీ! 11.

అక్షరరూపిణి బహు బీ
జాక్షర మయమైన నీ మహామంత్రంబున్
దీక్షమెయి జపమొనర్చిన
నక్షర యోగంబు గల్గు నానందమయీ! 12.

అమృతము గురిపించుచు లో
కములకు పుష్టియును తుష్టి కలిగించుచు భ
ద్రములిచ్చు నిన్ను గొలిచిన
నమృతత్త్వమ్మొదవు తథ్యమానందమయీ! 13.

నీ నగవులు వెన్నెలలై
జ్ఞానాద్భుత కాంతి నింపు జగతినని కవుల్
నీ నగవుల దలచుచు జ్ఞా
నానందము ననుభవింతు రానందమయీ! 14.

వేదాంతోద్యానవనము
లో దిరిగెడు నిన్ను జ్ఞానలోచనములతో
సాదరమున గనగోరుదు
నాది పరాశక్తి! సచ్చిదానందమయీ! 15.

త్రిభువన జననీ! నీ చిత్
ప్రభచే నలరారుచుండు బ్రహ్మాండంబుల్

శుభ వాక్సుమములతో నీ
కభిషేకమొనర్తు నమ్మ! ఆనందమయీ!  16.

తరుణాదిత్య సువర్ణా!
తరుణేందు విభూష! సర్వతాపఘ్నము నీ
దరహాసైందవ మహిమ
మ్మరుణా! కరుణాంతరంగ! ఆనందమయీ! 17.

పరమామ్నాయములను సు
స్వరమున వ్యాపింపజేసి జగములనెల్లన్
కరముద్ధరించు నిను మది
నరవిందాననను గొలుతు నానందమయీ!  18.

అరుణ సహస్రాధిక రుచి
పరగెడు నిను గాంచాగలుగు భాగ్యము నిమ్మా!
పరమేశ్వరి! యని పేడుదు
నరవిందభవాది వినుత ! ఆనందమయీ!  19.

అరిషడ్వర్గముచే మది
స్థిరత్వమును గోలుపోయె దీనావాన! స
త్వర మభయమ్ము నొసంగుము
హరిహరవిధి ముఖ్య వినుత! ఆనందమయీ!  20.

జననీ! ప్రత్యక్షరమున
దనరెడు నీ తత్త్వ మద్భుతము యోగులకున్
బొనగూర్చును పరమార్థము
ననఘాద్భుత చరిత! లలిత! ఆనందమయీ!  21.

నిను దలచి భవాని త్వ
మ్మని నంతనె మోక్ష మిచ్చెదట నీ నామం
బున మహిమ మమోఘము కద!
అనుపమ వాత్సల్యమయి! చిదానందమయీ!  22.

అమృతము గ్రోలిన వేల్పులు
క్రమముగ లయమొందగలరు, కాని, విషము పా
నము చేసిన శంభుడు ప్రళ
యమున వినోదమ్మునందు నానందమయీ! 23.

ఖేదమయమ్మగు సంసృతి
నే దురవస్థలను గనుచు నీ పదయుగ్మ

మ్మే దిక్కని పట్టితి న
న్నాదుకొనుము కరుణతోడ నానందమయీ! 24.

మిడి మిడి జ్ఞానముతో నీ
యడవుల బడినాడ మిగుల నలసితి నీవే
నడిపింపు మూతమిడి నను
నడవుల దాటింపుమమ్మ! ఆనందమయీ! 25.

పొందికతో కందమ్ముల
నందముగా చెప్పగలనె యని యించుకయున్
సందియము వలదు నీ దయ
నందిన నాకేమి కొదువ ఆనందమయీ! 26.

అందము జగముల నెల్లెడ
లందు గనుంగొనుచు మోద మందుటె యోగం
బందురు కద! ఆ స్థితియే
అందమ్ముల కందమందు రానందమయీ! 27.

డెందముల మంచి తలపులె
యందంబగు రీతి వాక్కు నర్థమ్ముల బల్
విందుగ నేర్పడ జేయుచు
నందించును సత్ఫలముల నానందమయీ! 28.

అంచిత సుధా సరోవర
మంచు దెలిసి నీదు తత్త్వ మందాదృతి వ
ర్తించుచు సేవించెద రా
యంచ నగుచు నమృతమూర్తి! ఆనందమయీ! 29.

నా మానసమను దోటకు
నామనియై భక్తిభావ మందము గూర్పన్
ప్రేముడి నే సుగుణాఢ్యం
బౌ మాలను గూర్తు నీకు నానందమయీ! 30.

నే మంజు గీతములలో
నీ మహిమల ప్రస్తుతింతు నిర్మల మతితో
ప్రేముడి నరజన్మంబను
నామనిలో పికము నగుచు నానందమయీ! 31.

నరజన్మంబామని యగు
ధర జన్మములందు ననుచు తగు జ్ఞానముతో

సరియగు సాధన చేయుచు
నరయదగును పరమఫలము నానందమయీ!	32.

వేదాంత మంత్రములలో
నే దేవిని ప్రస్తుతింతు రీశ్వరి యని నే
నా దేవిని నిను గొలిచెద
సాదరమతి ప్రణతులిడుచు నానందమయీ!	33.

ఏ దేవిని కొలిచినచో
వేద పురాణాది సకల విద్యలొదవు నే
నా దేవిని నిను గొలిచెద
సాదరముగ నన్ను బ్రోవు మానందమయీ!	34.

ఏ దేవిని ధ్యానించిన
నా దురితములెల్ల తొలగి జ్ఞానమొదవు, నే
నా దేవిని ధ్యానించెద
సాదరమతి నిను భవాని! యానందమయీ!	35.

లేదనకయె, కాదనకయె
నీ దాసుల బ్రోతువీవు నిజమదె నేనున్
నీ దయ గాంచుచు నిత్యము
సాదరమున గొల్చుచుందు నానందమయీ!	36.

ఏయే సందర్భమ్ముల
నాయా రసముల పెలార్చెదద్భుత రీతిన్
మా యెడ దయనే చూపుచు
హాయి నొసగుమమ్మ! సచ్చిదానందమయీ!	37.

మ్రింగెడిది హాలహలమని
మ్రింగునతడు నాథుడయ్యు మేలగు ప్రజకున్
మ్రింగుమని పల్కితివి భ
ద్రాంగీ! జోహారు నీకు నానందమయీ!	38.

అరు లార్వురనే కాదెం
దరిసైనను ప్రతిఘటింతు నా యండగ నో
పరమేశ్వరి! నీవుండగ
అరివీర భయంకరీ! చిదానందమయీ!	39.

మోదమ్మున భృంగమ్ములు
నాద మ్మొనరించుచుండ నా మదిలో నీ

నాదమ్మే విందు గొలిపె
నాది పరశక్తి! సచ్చిదానందమయీ! 40.

ధన ధాన్య వస్తు వాహన
జన గృహ భూమ్యాదులైన సంపదలను కో
రను నేను మోక్షదాయిని!
యనుపమ కరుణానిధాన! ఆనందమయీ! 41.

నిను గొలిచిన కవివరులకు
జనమాన్య కవిత్వ తత్త్వ సంపదలొదవున్
జననీ! వాగర్థ విభవ
మనుగ్రహింపుము ముదాన నానందమయీ! 42.

అందింపలేవు సౌఖ్యము
లెందును శబ్దాదులో మహేశ్వరి! మాకున్
పొందికతో ధ్యానాదులె
యందించును పరమ సౌఖ్య మానందమయీ! 44.

భ్రమలను చీకటులు తొలగి
క్రమముగ పరమార్థ దీప్తి కన్పడు నీ సా
యము నొందు సాధుజనులకు
నమిత సుఖావహము తథ్యమానందమయీ! 45.

సుమశరు బాణమ్ములలో
ని మహాద్భుత శక్తి యెల్ల నీ వరమె కదా!
సుమశరు జయింపదగు ధై
ర్యము మాకు ననుగ్రహింపు మానందమయీ! 46.

కలమును నే బూనిన యెడ
బలమును తేజమును నింపి భావోన్నతి తో
నలరు కవిత్వము గూర్చెద
వలఘు గుణాన్విత! మహేశి! ఆనందమయీ! 47.

వనజాత మహాటవిలో
ననుపమ మహిమాఢ్యవగుచు నలరెడు నిను గ
న్గొను భాగ్యమిమ్ము నాకా
యనుభవమే పరమఫలము ఆనందమయీ! 48.

కలవందు రఖిల జగముల
కలవందురు సకల భూత గణముల లోనన్

కలితగుణా! నా మదిలో
నలరెడు నిను నమ్మి కొలుతు నానందమయీ! 49.

సాలీడు వోలె చిక్కుల
పాలై సంసారమందు బంధమ్ములలో
సోలిన నను గని నా మొర
నాలింపుము నన్ను బ్రోవుమానందమయీ! 50.

కలవంటిది సంసారము
మెలకువయే యోగసిద్ధి మేల్కొలిపి భ్రమల్
తొలగించుచు ధ్యానము నా
కలవడగా చేయుమమ్మ! ఆనందమయీ! 51.

ఆశలు రెక్కలుగా ఆ
కాశమ్మున నెగురుచుంటి గతి తప్పితి నా
క్లేశముల బాపు మమ్మా!
ఆశల చల్లార్పుమమ్మ! ఆనందమయీ! 52.

నే విషయ సౌఖ్యములకై
ఆవంతయు నాసపడను అమ్మా! దయతో
శ్రీవిద్యానందము నిడు
మా! వేద వినోదినీ! చిదానందమయీ! 53.

అంతశ్చక్షు యుగముతో
స్వాంతమ్మున నిన్ను జూచి నంతనె మాకున్
శాంతి సుఖమ్ములు చేకురు
నంతర్ముఖ సేవితా! చిదానందమయీ! 54.

తంత్రముల విధు లెరుంగను
మంత్రమ్ములలో జెలంగు మహిమ లెరుగనే
యంత్రములెరుగను దుర్జన
హంత్రీ! ఎరుగుదును స్మరణ మానందమయీ! 55.

గురువఖిల లోకములకును
పరమ శివుడు మీ కృపావిభవమున విద్యల్
గరపెనని భక్తితో మీ
యరవిందాంఘ్రుల భజింతు నానందమయీ! 56.

వెన్నెలను దలతునే నీ
కన్నులలో నమృత రసముగా అదె నాలో

విన్నాణ మెసగ జేయుచు
నన్నిట శుభఫలము లొసగు నానందమయీ! 57.

నిచ్చెనలు పాములుం గల
ముచ్చట లేవియును వద్దు బుద్ధి బలముతో
నిచ్చలు నిను సేవించెడు
నచ్చపు జీవితము నీయు మానందమయీ! 58.

నా యెదను నీకు చక్కని
ఊయెలగా చేసినాడ నొప్పుగ సేవల్
చేయుచు నూపెదనమ్మా!
హాయిగ నందలరు మమ్మ! ఆనందమయీ! 59.

నీవే సత్యమును శివము
నీవేయని సుందరమ్ము నీవే యనుచున్
భావించి గొలుతు నిను న
మ్మా! విజ్ఞానప్రదా! చిదానందమయీ! 60.

సరసిజముల నేడింటను
పరిపరి రూపముల దాల్చి పరగెడు నిను సా
దరమున నే సేవించుచు
నరుసమ్మును బొందుచుందు నానందమయీ! 61.

జగతికి మూలము శబ్ద
మ్మగు శబ్దమునకు నకార మాధారముగా
నగు నయ్యకారమీవే
యగజా! జగములకు మూల మానందమయీ! 62.

త్రిగుణమ్ములకు ప్రతీకలు
ముగురమ్మలు సృష్టికెల్ల మూలము కాగా
ముగురమ్మలకును మూల
మ్మగు నమ్మవు నీవెగా చిదానందమయీ! 63.

అనలార్క చంద్ర ఖండము
లనబడు క్షేత్రములకెల్ల ఆధారమవై
పొనగూర్తువు చైతన్యము
ననుపమ తేజోనిధీ! చిదానందమయీ! 64.

తరుణారుణ బింబములో
నరుణిమయే రాగ పాశమదె బంధములం

దరిలోన పెంపుజేయును
హరిణీ! పాశముల ద్రుంచుమానందమయీ! 65.

రసమయమగు వెన్నెలచే
ప్రసారమగు లక్షణాఢ్య భావోన్నతి త
ద్రసమే కవితకు సార
మ్మసదృశ వాగ్విభవదాయి! ఆనందమయీ! 66.

నీవు ధరించుట వలనసె
పేవెలుగులతో జెలంగి విధుడెల్లెడలన్
కావించు రసాభ్యుదయము
యావజ్జన రంజకముగ నానందమయీ! 67.

అనుపమ వాత్సల్యమయీ!
వినుత సుగుణ వైభవమయి! విజ్ఞానమయీ!
జననీ! చిన్మయి! వాఙ్మయి!
అనురాగమయీ! మహేశి! ఆనందమయీ! 68.

ప్రజ్ఞాన ఘనమ్మని త
త్త్వ జ్ఞానులు ప్రస్తుతించు పరతత్త్వమ్మా!
సుజ్ఞాన యోగమిమ్మా!
అజ్ఞాన ధ్వాంత దీప! ఆనందమయీ! 69.

సకలాగమ సంవేద్యా!
సకలాక్షర కలిత రూప! సంవిద్విభవా!
సకల జగత్ పరిపాలిని!
అకలంక గుణాభిరామ! ఆనందమయీ! 70.

వర్ణమయీ! పంచాశ
ద్వర్ణమయీ! రసమయీ! సువర్ణమయీ! సం
పూర్ణ కళామయి! శైలకు
లార్ణవ శీతాంశుమయి! చిదానందమయీ! 71.

చిద్వహ్ని కుండజాతా!
విద్వద్వర్యనుత కీర్తి విభవ సమేతా!
సద్వాచ్యా! శృతివేద్యా!
అద్వయ తత్త్వాభిరమ! ఆనందమయీ! 72.

నీవేగతి నీవేగతి
నీవేగతి వనుచు గొలుతు నీ పాదములన్

రావే వడి రావే నా
ఆవేదన తీర్చ రావె ఆనందమయీ! 73.

గతివీవని మతివీవని
ధృతివీవని నిన్ను గొలుతు దీనావన స
ద్గతి జూపుచు ధృతి గూర్చుచు
నతి సౌఖ్యము గూర్పు మమ్మ! ఆనందమయీ! 74.

కలభాషిణి ఈ కృతికై
కలమును నే బూని నంత కడు వడివడిగా
వెలువడెను పద్యరత్నము
లలరింపగ నీ మనమ్ము నానందమయీ! 75.

చనునతి తేజముతో నా
మనమిది నీ వాహనముగ మనుటొప్పగు దీ
నిని స్వీకరింపుమమ్మా!
అనుపమ తేజోమయీ! చిదానందమయీ! 76.

సాయము నీవే నాకని
నీ యండను జేరినాడ, నీ వొప్పుగ నా
కే యోగము నొసగిన నే
నా యోగము నభ్యసింతు నానందమయీ! 77.

సంగము దోషమ్మట, స
త్సంగము యోగప్రదమ్ము, సజ్జనతతికిన్
బంగరుతల్లీ! శివున
ర్ధాంగీ! శుభయోగ మొసగు మానందమయీ! 78

నీ పద నఖముల కాంతులు
వ్యాపింప నవిద్య తొలగి యలరె జగంబుల్
నీ పదములంటి మ్రొక్కెద
నాపన్న శరణ్యా! సచ్చిదానందమయీ! 79.

కరుణాతరంగితాక్షీ!
శరణాగత వత్సలా! ప్రసన్నగుణాఢ్యా!
దరహాస సుందరాస్యా!
హరి హర నుత శీల! సచ్చిదానందమయీ! 80.

జ్ఞానాద్భుతాతిశయమే
ఆనందరసప్రశస్తియై రూపొందున్

జ్ఞానానంద రసాంబుధి
వౌ నిను ధ్యానింతు సచ్చిదానందమయీ! 81.

భద్రములను వినుచుందుము
భద్రములను గాంచుచుండి పలికెద మెపుడున్
భద్రమగు వాక్యముల శీ
తాద్రి సుతా! భద్రమూర్తి! ఆనందమయీ! 82.

సిందూరారుణ విగ్రహ!
ఇందుకళా భూషితా! సురేంద్ర సువంద్యా!
సుందర సుస్మిత వదనా!
అందుకొనుము మా ప్రణతుల నానందమయీ! 83.

చదువులు నేర్పితివమ్మా!
సదసద్ విజ్ఞానమును నొసంగితివమ్మా!
మది శాంతి సుఖములిడుసె
య్యదియో యా యోగమొసగు మానందమయీ! 84.

యాగమ్ములు బహు విధములు
యోగమ్ముల నొసగుచుండు నొప్పుగ నంత
ర్యాగమున నిన్ను గొలిచెద
నాగమ వినుతా! భవాని! ఆనందమయీ! 85.

సలలిత శబ్దార్థంబుల
కలయికతో చిత్ర చిత్ర కల్పనల రస
మ్ముల నొల్కు స్తోత్రమాలల
నలరించెదనమ్మ నిన్ను నానందమయీ! 86.

నీ దరహాస జ్యోత్స్నను
నే దలపగనే లభించె నిస్తుల కవితా
స్వాదు రసధార లమితా
హ్లాదమ్మును గూర్చుచుండి ఆనందమయీ! 87

నీ మందహాస చంద్రిక
నా మానస మందు నింపె జ్ఞానామృత హే
లా మాధుర్యము జగదం
బా! మోదము పెల్లివిరియ నానందమయీ! 88.

నీ మందస్మిత కౌముది
ప్రేమసుధల నింపె నాదు హృదయమునందున్

సోమకళాంచిత! శివవని
తా! మంగళరూప! సచ్చిదానందమయీ! 89.

నీ దరహాస వికాస
మ్మే దివ్య ప్రభల నింపి ఎల్ల జగములన్
శ్రీదంబగు ననవరతా
హ్లాదమ్మును నింపుచుండు నానందమయీ! 90.

నీ నగవను పెన్నెలయే
నానా రసభరితమగుచు నవ్య కవిత్వా
నూనవిభవమ్ము నిడు న
మ్మా! నళిన వనాంతరస్థ! ఆనందమయీ! 91.

ఏ నీ విభవము ఢాకిని
యై నాదు విశుద్ధ చక్రమందు జెలగునో
నేనా రూపము నాదృతి
ధ్యానించెద నేకవక్త్ర నానందమయీ! 92.

ఏ నీ విభవము రాకిని
యై నాదు ననాహతాబ్జమందు జెలగునో
నే నా రూపము నాదృతి
ధ్యానించెద ద్విముఖి నాత్మ నానందమయీ! 93.

ఏ నీ విభవము లాకిని
యై నా మణిపుర సరోజమందు జెలగునో
నే నా రూపము నాదృతి
ధ్యానించెద త్రిముఖి నాత్మ నానందమయీ! 94.

ఏ నీ విభవము స్వాధి
ష్ఠానాబ్జాతమ్మునన్ పొసగు కాకినియై
నే నా రూపము నాదృతి
ధ్యానింతు చతుర్ముఖిని చిదానందమయీ! 95.

ఏ నీ విభవము సాకిని
యై నా యాధార చక్రమందు జెలగునో
నే నా రూపము నాదృతి
ధ్యానింతును పంచ వక్త్ర నానందమయీ! 96.

ఏ నీ విభవము హాకిని
యై నా యాజ్ఞా సరోజమందు జెలగునో

నే నా రూపము నాదృతి
ధ్యానింతును షణ్ముఖిని చిదానందమయీ! 97.

ఏ నీ విభవము యాకిని
యై నా యందలరునో సహస్రారమునం
దా నీ రూపము నాదృతి
ధ్యానింతును విశ్వరూప నానందమయీ! 98.

ఒక మంత్రమె యననేలా?
సకలాక్షరములు పదాలు సత్ఫలదములై
ప్రకటించును నీ మహిమము
నకలంక గుణప్రపూర్ణ! ఆనందమయీ! 99.

రసమీవే నా తలపుల
రసమీవే నా పలుకుల రసమయ హృదయా!
రసమీవే ముజ్జగముల
నసదృశ కరుణానిధీ! చిదానందమయీ! 100.

మాటలలో రసమయమగు
పాటలలో నమిత భక్తిభావము నీపై
నాటుకొనె నా మనమ్మున
హాటకగర్భాది నుత! చిదానందమయీ! 101.

నరజన్మమ్ము లభించెను
వరమై నీ యందు భక్తిభావమ్మెసగెన్
పరమేశీ! నిను వేడుదు
నరుసముతో మోక్షమొసగు మానందమయీ! 102.

శిల వంటి నా మనమ్మును
దొలిచి యొనర్చితివి పూలతోటగ నందున్
గల పూలనల్లి మాలల
నలరించెద నిన్ను సచ్చిదానందమయీ! 103.

కన్నెర్ర మాన్పి, లెస్సగ
కన్నుల తెరపించితీవు, కాశీలోనన్
మున్నా వ్యాస మహర్షికి
అన్నమునిడి అన్నపూర్ణ! ఆనందమయీ 104.

నీ నామ మంత్రమహిమ
మ్మే నాద మయమ్మునర్చి యెల్ల జనులకున్

వీనుల విందొసగుచు బ్ర
హ్మానందము గూర్చుచుండు నానందమయీ! 105.

నీ నామ మంత్ర మాదృతి
గానము నొనరించుసెడల కవచంబగుచున్
నానాబాధల దొలచుచు
నానందము గూర్చుచుండు నానందమయీ! 106.

నీ నామ మంత్ర జపమే
మానసమును శుద్ధి చేసి మాయ నణచుచున్
దీనత్వంబును బాపుచు
నానందము గూర్చుచుండు నానందమయీ! 107.

నీ నామ మంత్ర విభవము
వేనోళ్ళను బొగడతరమె విశ్వాధారం
బై నడిపించు జగమ్ముల
నానంద పథమ్మునందు నానందమయీ! 108.

నీ నామ మహౌషధమే
పోనడచుచు జన్మరోగముల సాధకులన్
నీ నళినాంఘ్రుల జేర్చుచు
నానందము గూర్చుచుండు నానందమయీ! 109.

నీ నామ సుధాసారము
పానము నొనరించి నంత భవ భయహరమై
మానస మందిరమున పర
మానందము గూర్చుచుండు నానందమయీ! 110.

నీ నామ మహిమచే మది
నానాబంధములు వేగ నాశము కాగా
జ్ఞానప్రభ లలరారుచు
నానందము గూర్చుచుండు నానందమయీ! 111.

ఆనందము నానందము
నానందమె యొదవు నాకు సాదరమున నా
మానసమెందున లగ్నం
బైనను నిను దలచుచుండ నానందమయీ! 112.

దినములు మాసము లబ్దము
లని బొనరిచి కాలమాన మన్ని తిథులలో

తనరెదవు కళామయిపై
యనుపమ విభవప్రదా! చిదానందమయీ! 113.

ఏ యమ్మ దివ్య తత్త్వము
ధ్యేయంబై నా మనమ్ము దీపిలు నటులన్
జేయుచు మోదము నింపునొ
ఆయమ్మను నిన్ను గొలుతు నానందమయీ! 114.

ఏ యమ్మ భవ్య తత్త్వము
జ్ఞేయంబై సాధకులకు చిత్తమ్ములలో
మాయల నెల్ల యడంచునొ
ఆయమ్మను నిన్ను గొలుతు నానందమయీ! 115.

ఏ యమ్మ ప్రేమతత్త్వము
శ్రేయమ్మును గూర్చుచుండి జీవులకెల్లన్
హాయిని గొలుపుచునుండునొ
ఆయమ్మను నిన్ను గొలుతు నానందమయీ! 116.

ఏ యమ్మ యనుగ్రహమే
సాయమ్మయి సాధకులకు జ్ఞాన పథమునన్
చేయూత మ్మిడుచుండునొ
ఆయమ్మను నిన్ను గొలుతు నానందమయీ! 117.

భవమతి దుఃఖమయమ్మగు
భువి నంతముగూడ దుఃఖపూర్ణమ్మగు నీ
భవ నాశముల కతీత
మ్మవు ముక్తిపదమ్ము నొసగు మానందమయీ! 118.

చిందర వందరయగు భవ
మందిట శాంతియును సౌఖ్యమరుదయ్యెను,నా
యందతి వాత్సల్యముతో
నందింపు మభీతిహస్త మానందమయీ! 119.

అందములనుకొని భ్రమయుచు
మందుడనై పంకమున నిమగ్నుడ నైతిన్
పొందికతో నను బ్రోచుచు
నందింపు మభీతిహస్త మానందమయీ! 120.

అందలము లెక్కనెంచుచు
తొందరపడి జారిపడితి దుర్దశలందున్

మందుడనగు నను బ్రోచుచు
నందింపు మభీతిహస్త మానందమయీ! 121.

అందని ఫలముల నెన్నియొ
పొందగ నాశించి యెగురబోయి పడితినే
మందును నా దుస్థితి గని
యందింపు మభీతిహస్త మానందమయీ! 122.

అందరిలో నగుబాటును
పొందక నీ యాశ్రయమున పుష్కలముగ నా
నందము నొందగ వేడుదు
నందింపు మభీతిహస్త మానందమయీ! 123.

కందుకము వోలె జీవిత
మందున పడి లేచు చుంటి, నహరహము, ననున్
క్రిందపడనీక బ్రోచుచు
నందింపు మభీతిహస్త మానందమయీ! 124.

ముందునొక నుయ్యి, వెనుకటి
యందున నొక గొయ్యి యుండ నాపద పాలై
యెందు జనలేని ననుగని
యందింపు మభీతిహస్త మానందమయీ! 125.

దుందుడుకుతనముతో నీ
ముందర విద్దెలను చూపబోయితి విసువున్
జెందక దయతో నను విని
యందింపు మభీతిహస్త మానందమయీ! 126.

ఇందేనియు నందేనియు
నెందేనియు శాంతి సుఖములే కోరుచు నీ
ముందర వ్రాలితి నమ్మా!
అందింపు మభీతిహస్త మానందమయీ! 127.

చందనచర్చిత విగ్రహ!
మందస్మిత చారువదన! మదిలోన భవత్
సందర్శన భాగ్యంబిడి
యందింపు మభీతిహస్త మానందమయీ! 128.

బృందావనమును మించిన
అందముతో నద్భుతముగ నలరెడు ధామం

బందు వసించెడు తల్లీ!
యందింపు మభీతిహస్త మానందమయీ! 129.

బృందారకగణ మునిజన
వందిత సుగుణాలవాల! పరమఫలమునే
నందెడు భాగ్యము గూర్చుచు
నందింపు మభీతిహస్త మానందమయీ! 130.

వందనము సర్వమంగళ!
వందనము వినీలకంఠ వామార్ధాంగీ!
వందనము గైకొనుచు, నా
కందింపు మభీతిహస్త మానందమయీ! 131.

కందోయికి వెలుగిడి యా
నందమ్మును చాల నింపి జ్ఞానప్రభతో
విందొనరించెడు తల్లీ!
యందింపు మభీతిహస్త మానందమయీ! 132.

చందనరసదిగ్ధాంగీ!
మందస్మిత శోభితాస్య! మంగళరూపా!
మందారసుమప్రియ! మా
కందింపు మభీతిహస్త మానందమయీ! 133.

ఎందరొ మహానుభావులు
అందరిలో నిన్ను గనుచు నాదరముననే
వందనము లాచరించెద
నందుకొనుము ప్రేమ మీర నానందమయీ! 134.

చైతన్య సుధా ధారల
ప్రీతిగ వర్షించి జ్ఞాన విభవమ్మొసగన్
చేతోమోదము నిడు ప్ర
ఖ్యాతా! శ్రీమాత! సచ్చిదానందమయీ! 135.

ఓం తత్ సత్